# జ్ఞాపకార్థము



కవి పౌత్రుడు

సేనయందలి ఏ.యం.సి. చేరుటయును
నాయకుండుగ గుర్తింపు౯ నందుటయును
మంచివాడని కీర్తిగ డించుటయును
తలచి, సంతసమ్మొందెడి తరుణమందు
మమ్ములందర్ని దుఃఖ సంద్రమ్ము౯ ద్రోసి
ప్రభువు చేరితే పుత్ర! శ్రీరామశర్మ-!

ఒంగోలు
1-08-2003

ఇట్లు, తండ్రి
రామబ్రహ్మం



# శ్రీ వీరబ్రహ్మేంద్ర స్వాముల వారి

గ్రంథములు వలయువారు :

## శ్రీ ఇంకొల్లు రామబ్రహ్మం

C/o శ్రీ ఆదిమూలం వెంకటసుబ్బారావు

విరాట్‌నగర్, కర్నూలురోడ్, ఒంగోలు

ప్రకాశంజిల్లా.

## : రాట్టము

సీ॥ మయవిశ్వకర్మ ని • ర్మాణ
భావగరిష్ఠత • బయలువెం
సుర, సిద్ధ! సాధ్యకి • న్నర వర
కర మొప్పివారి సం • కట
అనఘుగాంధీ మహా • త్ముని య
యలఘు దీవుల నంత •
కలభారతాగ్ర గ • ణ్యుల మన్న
ప్రణవనాదమున పా • వ

తే॥గీ॥ కార్మికుల కాధిపత్యుల •
భరతదేశము ఖద్దరు • ప్ర
ప్రతిగృహంబున బూజింప •
రాట్నమే ప్రొద్దు మహిదఁన

# కర్తృవిజ్ఞాపనము

చదువరులారా!

సీ॥ కాళిదాసాదిస • త్కవికావ్యములెగాక
తెనుఁగు కావ్యస్థితుల • దెలియకున్న
తగునలంకారశా • స్త్రగ్రంథములెగాక
యితరశాస్త్రంబుల • నెరుఁగకున్న
కవిజనస్తుత్యల • క్షణగ్రంథములెగాక
వ్యాకరణంబుల • నరయకున్న
ప్రథితశృంగారప్ర • బంధమ్ములేగాక
ఘనని ఘంటులఁ బొడ • గాంచకున్నఁ

తే॥గీ॥ భక్తి నీశిల్పమాతృస్త • వంబునేను
జెప్పినాఁడను. దీనిలో • దప్పులెన్నొ
కవులు; బండితులెల్ల న • న్గనికరించి
విషయము గ్రహించి, నేరముల్ • విడువరయ్య

2-11-1926

పంతనూతలపాడు

ఇట్లు
గ్రంథకర్త

# స్వజన వినుతి

సీ॥ శ్రీ పౌరుషేయకు । లీనులార! యింకైన
శిల్పమాతను ప్రతి । ష్ఠింపరయ్య
పంచాననోద్భవ । ప్రథితులార! యింకైన
శిల్పశాలల నెల । కొల్పరయ్య
విశ్వకర్మాన్వయ । విదులార! యికనైన
శిల్పశాస్త్రము నభ్య । సింపరయ్య
సరసవిద్వన్నుత । స్థపతులార! యింకైన
శిల్పవేత్తలను బూ । జింపరయ్య

తే॥గీ॥ ప్రవిమలాచార్యనామక । ప్రముఖులార!
శిల్పమింకనైన నభివృద్ధిఁ । జేయరయ్య
హీనసడతలనెల్ల వ । ర్జింపరయ్య
మనకుగలసత్ప్రతిష్ట గా । పాడరయ్య!

# అంకితము

తే॥గీ॥ నన్నుఁగని పెంచి, సర్వము । న్నారవోసి
స్వర్గమేగిన యక్కయా । చార్య: నీదు
ఋణముఁదీర్చఁగ నావల । నేమి గామి
కృతినొసంగితి నన్నంటి । కిదియెగొనుము

# కర్తృవిన్నతి

ఆ॥వె॥ నాదిగురుని కడనుఁ । బాదసేవనొనర్చి
గఱచినట్టివిద్య । కాదుకాదు
వినికిడిని గ్రహించు । విద్యయౌగావునఁ
దప్పులుండవచ్చు । దయను గనుఁడి

ఇట్లు
భక్త శ్రీరామశర్మ
గ్రంథకర్త

# మాతృపూజ

సీ॥ శ్రీ కందుకూర్వంశ । సింధునం దుదయించి
యింకొల్లువారి పే । రింటఁజొచ్చి
ధవునాజ్ఞలెల్ల నా । దలఁదాల్చి నెరవేర్చి
పరమక్ష్మాపాద్యష్టి । పాత్రతఁగని
సంతాన ఫలమున । కెంతయు విళ్ళూరి
గలిగినిల్వమి వేలు । ల్పులకు మ్రొక్కి
ఏదేవదేవు స । త్కృపనొ నన్నుఁగాంచి
సమ్మోదమున కష్ట । చయము నోర్చి

తే॥గీ॥ నోట నిడుకొనువాని నా । నోటికిచ్చి
పెంచి ప్రేముడిఁ బెండ్లిగా । వించినట్టి
జనని! మాణిక్యమాంబ! స । ద్గుణకదంబ
నీఋణంబెట్లు దీర్పఁగా । నేర్తునమ్మ!

# గురుస్తుతి

సీ॥ శ్రీ విరాట్ప్రు భువవంశ • చేవడ్డె పాటివం
శాబ్దిఁ బద్మారిగా • నవతరించి
బాల్యమందునె ప్రతి • భాప్రభావముచేత
నకలపురాణ శా • స్త్రములనేర్చి
ఘనకులోద్ధరణ కం • కణము ని యచ్చ ట
చ్చట నిరంకుశముగా • సభలఁజఱపి
స్వమత "ప్రబోధిని" • పత్రికనెలకొల్పి
వలయుధర్మముల నిం • పలరవ్రాసి

తే॥గీ॥ సార, ఘనసార, నీహార • సాంద్రకీర్తి
వల్లికలకెల్ల భువిఁబుట్టి • నిల్లుఁజేసి
జయముఁగొన్న నిరంజన • శాస్త్రికిపుడె
కలిత సాష్టాంగ కృతనమ • స్కారమిడుదు

# గ్రంధకర్త

సీ॥ గుంటూరు మండలి। ఘంటా పథంబుగా
నెరయు వంగోల్పురి। పరము మాది
సరస సంగీత శా। స్త్ర జ్ఞానభరితమౌ
మహిఁ గ్రొత్తపల్లి గ్రా। మంబుమాది
అఖిలలోకేశుఁడ। వ్యయుఁడైన పరమాత్మ
పాదాబ్జముల మీఁది। భక్తి మాది
కవితా ధురీణ ప్రా। జ్ఞవరుల్జనించిన
పావన వంశో ద్భ। వమ్ము మాది

తే॥గీ॥ అరయఁగ; విరాట్టు గ్రం। థాలయంబు మఱియు
లీల "సంజీవనౌషధ। శాల" నిల్పి
సాంఘికోన్నతి హృదయకం।జంబునందుఁ
గోరు శ్రీరామశర్మ నాఁ। బేరునాది.

జై విరాట్

# : విజ్ఞప్తి :

మహాశయులారా!

మా నాన్నగారికి కవిత్వమన్న మహా ప్రేముడి. వీరు రచించిన వానిలో "శిల్పమాతృ స్తవము" ప్రథమ రచన కాబట్టి శ్రీ విరాట్ ప్రభు రాజే, జగజ్జనని యగు శిల్పమాతను వివిధ రీతులలో స్తవము చేసియున్నారు. ఇందు మహాత్ముల జీవితావళిని చేర్చియున్నారు

సంఘీయులేగాక సర్వులు శిల్పమాతను స్తవము చేసి తల్లి కృపకు పాత్రులగుదురని విజ్ఞప్తి చేయుచున్నాను.

మకాం: ఒంగోలు　　　　ఇట్లు

విరాట్‌నగర్　　　　కుమారుడు

1-8-2003　　ఇంకొల్లు రామబ్రహ్మం

ఓమ్

# శిల్ప మాతృ స్తవము

సీ॥ శ్రీమత్స ముద్రప • రీతధాత్రీతలం
బరయనే దేవి సిం • హాసనంబొ
తుంగ భద్రాది స • త్పుణ్యజీ, వనదులు
సారిదినే దేవి ప్ర • సూన సరులొ
ఉపమాన శూన్యమై • యొప్పు నీలనభోంత
రాళమే దేవి ము • త్యాల గొడుగొ
తృటిఁజరా చరపాళి • సృష్టింపఁ జాలిన
శిల్పులే దేవి క • నల్పసుతులొ
తే॥గీ॥ అట్టి యసదృశలోక వి • ఖ్యాత చరిత!
సద్గుణోపేత, విమలయ • శఃప్రపూత
భక్త సన్నుత, సాంద్రకృ • పాసమేత
శిల్పమాతా! సుతాళి ర • క్షింపు జోత!

సీ॥ శ్రీరమణాచార్యచే • సిక మహత్త్వం డెప్ప
త్వన్మస్తకమున ఛ • త్రంబుపట్ట
వీర భద్రాచార్య • సూరి శేఖరుం డెప్ప
భవదీయ విజయకం • బము వహింప
నలవిరంజన పండి • తాగ్ర గణ్యుండెప్ప
తావక యాజ్ఞనౌ • దలం ధరింప
రామలింగా చార్య • రత్న పండితుండెప్ప
నీకు వింజామరల్ • నెమ్మివిసర

తే॥గీ॥ కవిజనా నీకమెప్పు మం • గళము బాడ
తక్కుయువకులు వేడ్క సం • స్తవము సేయ
ఎల్లలో కాళిగృపదృష్టి • నేలుచున్న
శిల్పమాతా! నమస్కృతుల్! జేతునమ్మ

సీ॥ చదివించితివి కదా । సదసద్వివేక సం
కీర్ణమౌ కావ్యాళి । గృపధలిర్ప
త్రోవఁజూపితి గదా । తులలేని నవరసా
స్పదమైన వరకవి । త్వ ప్రశంసఁ
జేయించితివి గదా । జెన్నలరారంగ
ధోరణిగ్రంథ చ । తుష్టయంబు
రప్పించితివిగదా । రమణీయతర కీర్తి
పరసవిద్వత్స భా । సదులలోన

తే॥గీ॥ నెట్టులో సాకనావు న । న్నింత డనుక
గాని ప్రకృతము రచియించు । కబ్బమునకు
నీ సహాయబలంబెంతొ । నీఁ దలంతు
చిత్తమందహరహముఘను, శిల్పిమాత!

సీ॥ కవితనీకల వౌనె । గష్టమెందుకటంచు
నెందరెందరొ ఫుల్ల । లేసినారు
మీ కెందుకీవిద్య । మీపని, గాకవి
యెందరెందరొ వచి । యించినారు
ఊరూర నెందరో । నున్నారె కవులంచు
నెందరెందరొ(జప్ప । రించినారు
బీజవిషాక్షరా । క్రిమ్మంగును విన్నంచు
నెందరెందరొ బెది । రించినారు

తే॥గీ॥ సంస్కృతాంధ్రాది శబ్దల । క్షణ మెఱుంగక
యల్లుటేలని యెందరో । నడిగినారు
ఎవ్వరెట్లనుకొన్న నా । కేమితల్లి!
త్వత్కృపారస వృష్టి నా । పైనగురియ

సీ॥ శశిధర, నిర్జరా • చార్యాది భావుక
గ్రహదృష్టిగల జన్మ • రాసిబలమొ
రవి కులజనిత శ్రీ • రాముల వరశుభా
కర నమన్వితనామ • కరణబలమొ
రామాయణా న్వయ • రత్న సీతారామ
వంతుల యక్షర • భ్యాసబలమొ
ఒద్దిక తండ్రి నా • కుపదేశ్యమొసరించు
మహిత పంచాక్షరీ • మంత్ర బలమొ

తే॥గీ॥ శైశవంబున నుండి హ • ర్షమునఁబ్రోచు
త్వత్కృపా రసవీక్షణ • బలమొగాని
గాంచ మెందరొమదిఁద్రిప్ప • గలిగినను, క
విత్వ మెట్టులో వృద్ధియై • వెలసెఁ దల్లి!

సీ॥ పదిపైన తొమ్మిది ♦ వందల సప్తద
శాబ్ది జూన్నెల మధ్య ♦ మందులేచి
వంగోలు కేగినే ♦ వచ్చెదనని యింటఁ
దల్లి దండ్రుల కస ♦ త్యములుఁ జెప్పి
అతులితంబైన సం ♦ స్కృత విద్యనార్జింప
ఘన దుగ్గిరాలలో ♦ గాలుఁబెట్టి
కులమణిశాస్త్రిలే ♦ కునికెంతొఁజింతించి
యిచ్ఛఫలించ మి ♦ కిల్లుఁ జేరి

తే॥గీ॥ మదిని శాస్త్రిని ద్రోణుని ♦ పగిదినెంచి
ఏకలవ్యుని వలె గురి ♦ నెలమినిల్పి
నేర్చిన కవిత్వమున గూర్చు ♦ "నీస్తవంబు"
శశికి నూల్పొగువలు; జగ ♦ జ్జనని! గొనుమ

సీ॥ కనుఁగొనుచున్నారు । కన్నబిడ్డలు లేచి
నీమహా మహిమల । నిప్పుడిప్డు
తిలకించు చున్నారు । దేసీయులాసక్తి
యుష్మదాత్త కొరంత । లుడుగ వడిగఁ
దపియించు చున్నారు । ధర్మతత్పరులెల్ల
తమ బూర్వగతి విల్ప । విమలబుద్ధిఁ
గాయించు చున్నారు । కవివరుల్ తావక
సత్కీర్తి చంద్రికల్ । సర్వదిశల

తే॥గీ॥ విజము మ్రోయించుచున్నారు। విజయభేరి
"శిల్ప మాతకు జే" యని । శిష్టగుణులు
దీన రక్షాపరాయణి । త్రిజగదంబ!
అమల సుగుణకదంబ! జో । హార్మదంబ!

సీ॥ సర్వ సర్వంసహా । చక్రస్థలీప్రజా
వ్యూహమేలుము; విరా।ట్పురుషురాణి
భవ్యసంభావ్య సం।పచ్ఛయంబులొసంగి
స్థిర కీర్తి నిల్పుమో । శిల్పమాత!
జాతీయవిద్య వి । శారదాభ్యుదయంబు
ప్రభవింపఁజేయు స । మ్మతిమదంబ
భరత కార్మికగౌర । వాసీకముదయింపఁ
గడుమంగళాశీస్సు । లిడుమతల్లి!

తే॥గీ॥ ఆత్మశుద్ధిగ నీదు పు । తాళియొసఁగు
స్వాగతంబందు కొనఁగదే । భాగ్యలక్ష్మి!
భూరి భవదీయపదయు గాం । భోజములకు
భక్తి సాష్టాంగ కలితాభి । వాదమమ్మ!

సీ॥ భూలోక కైలాస • మోయనందగు లంక
జెలువమ్ములొలయ సృ • ష్టించునాడు
వర్ణింపనేరికి • వశముగానటు వంటి
ద్వారక నిర్మించి • వరలునాఁడు
నిజముకల్లగ కల్ల • నిజముగాఁజూపించు
ధర్మరాట్సభఁజేసి • దనరునాఁడు
వరిపంథికడుపులో • బల్లెమై వెలుగొందు
ప్రాంతంపురా కోట • గట్టునాఁడు

తే॥గీ॥ కలియుగంబున నతికీర్తిఁ । గాంచినట్టి
లీలమై వారథినిఁ బ్రక • ల్పించునాఁడు
నీకుమారులు సంస్తవ • నీయులగుట
భవ్యభవదీయ సత్కృపా • బలమెతల్లి!

సీ॥ ఢిల్లీపురమున దీం । ద్రించునయస్తంభ
మున, బవితనము త । గ్గినదిలేదు;
తిరుపతి మొదలైన । దివ్యస్థలంబుల
చిత్రశిల్పము చెక్కు । చెదరలేదు;
అత్యద్భుతైక మ । హానంది వక్త్రభ
వ్యాపార నీరంబు । లాగలేదు;
సింహాచలంబునఁ । జెలఁగు సిలామృగేం
ద్రముల భీకరములు । తరుగలేదు;

తే॥గీ॥ భూరి మార్గాపురప్లుఁజూంచు।మున్నుగాఁగ
లట్టి శిల్పములొకయింత । యైనఁగావె
మెఱుఁగు మాయఁగలేదింత । వరతుఁదల్లి!
అరయునిది యెల్లనీమహి । త్యములుగావె?

సీ॥ ఎన్నినాళ్ళుండియో ♦ కన్న పుత్త్రులకెల్లఁ
గూర్మి మై సిరులఁ జే । కూర్చినావు
సరిరాని రాజసం ♦ స్థాన శిల్పులఁజేసి
యోజనుయ్యెల లందు ♦ నూపినావు
వంశంబును గళంక ♦ వశము గాకుండ;నె
వ్వేసిల్గులను సైత ♦ మోమినావు
ఆ॥ సేతుసీతా చ ♦ లాంతరక్షోణుల
నేకుమారుల పేరు ♦ నిల్పినావు

తే॥గీ॥ తల్లికిని దల్లి! శిల్పమా ♦ తామతల్లి
తావు సల్పైని మేలొక్క ♦ టేని లేదు
నీఋణమ్ముఁ దీర్చ మావల ♦ నేమికాదు
అంజలికి పైన; గైకొను ♦ మమ్మ! దయను

సీ॥ హేతు భూత విశేష। మెరుకఁజేసినయట్టి
మేటిబ్రహ్మంగారు। చాటుకేగె;
ప్రతిలేవి సద్యశో। భరితుఁడై తనరారు
మార్గసాహాయుండు। మహిఁదొరంగె;
దండివిద్వత్స భా। మండలి మెప్పించు
పండితుండవ్వఖ। ఖ్యుండు సమయె;
నంఘసంస్కరణ కై। సభలెన్నొ గావించి
తుదకాంజనేయకో। విదుఁడుపోయె;

తే॥గీ॥ నక్కటక్కట యిట్టి మ। హాత్ము. లిట్టి
వేద శాస్త్రపురాణార్థ। విదితు. లిట్టి
స్వకుల నాయకులే మమ్ముఁ।బాసి చనఁగ
వింక నీకన్నమాకు ది। క్కెవ్వరమ్మ!

సీ॥ సాంద్రఘారాధరా • సక్తినెమ్మనమూని
గమకించు యలమ యూ • రములఁబోలె;
శతపత్రమకరంద • స్వాదనాభీరతిఁ
బ్రమదాఢ్ఢిఁదూగు భృం • గములఁబోలె;
కమలారి బింబ స • త్కళావితానమ్ముకై
దమకించుఘనచ కో • రములఁబోలె;
బాలామ్రనవ పల్ల • వభ్రాంతినెంతయుఁ
దిలకించు గండు కో • వెలలఁబోలె;

తే॥గీ॥ వేచియుంటిమి నీకృపా • వీక్షణముకు
భక్తి మేముభవత్పదా • బ్జముల కెరగి
నీటముంచినఁదేల్చిన • నీవెగాని
ఇతర మొక్కింతయైన మే • మెరుఁగమమ్మ

సీ॥ క్రమత ధర్మస్థాప • నముఁజేయు విశ్వేశుఁ
డరిగెను; మృగరాజ • మంతవాఁడు
వైరివారిద గంధ • వాహుండు శరభేంద్రుఁ
డరిగెను; శరభేంద్ర • మంతవాడు.
స్వకులాభ్యుదయముకై • శ్రమనొందు కవిరుద్రుఁ
డరిగెను; శార్దూల • మంతవాఁడు
వైతండికులమాటు • వైచెడు శేషాఖ్యుఁ
డరిగెను; మత్తేభ • మంతవాడు

తే।గీ। నాయకుఁడు వోయె; కళ్యాణుఁ • డంతవాడు
ఆకట! బసవాఖ్యుఁడేగె; కొం • డంతవాడు
మమ్ము సర్వమ్ము భవదధీ • నమ్ముఁజేసి
క్షితిని మాకెల్ల నిష్టూపి • శిల్పమాత!

సీ॥ జనయిత్రి శ్రీ శిల్ప। వనితామ తల్లిరో
కరుణింపుమమ్మ స్వా। గతము నీకు
త్వత్కుమారుల శిల్ప ధౌరేయులుగఁజేసి
మించుగోర్కెల ప్రసా। దించుమమ్మ
ఐకమత్యాది మ। హైశ్వర్యము లొసంగి
యనిశంబు మమ్ముల। మనుపుమమ్మ
భారతీయులలోనఁ। బ్రఖ్యాతి రప్పించి
ఈమహిస్థలి మమ్ము। నేలుమమ్మ

తే॥గీ॥ మిగుల మాదృశసుతుల క। న్నుఁగవఁ గాంచి
చెఱుశుభంబాయువుల్ కీర్తి। నీగదమ్మ
యిట్టితరి నీవెమమ్ము ర। క్షింపకున్న
మమ్ము రక్షించువారెవ। రమ్మ తల్లి!

సీ॥ కన్నబిడ్డలటంచు । కవికరంబు వహించి
మించుప్రేముడి. మొరా । లించుమమ్మ
ప్రాచీన శిల్పగౌ । రవసమున్నతి నాధు
నికులలో తిరిగిప్డు । నిలుపుమమ్మ
పుత్రాభ్యుదయము సం । పూర్తిగా మదిఁగోరి
యిచ్ఛమైయే ప్రొద్దు । నేలుమమ్మ
సర్వస్వమీవని । జగతినమ్మిన మమ్ము
వించుకైన ననుగ్ర । హించుమమ్మ

తే॥గీ॥ అరుణుఁడబ్జారి; తారలు । న్నంత దనుక
స్వచ్ఛమైనల సదృశః । శ్చంద్రికలను;
మంగళాశీస్సులను; గోరు । మాకొసంగి
శిల్పమాతా! యిఁకైన ర । క్షింపుమమ్మ!

సీ॥ ఘోరసంసార; కూ ♦ పారవీచీహతిఁ
దప్పించుమమ్మ నే ♦ తాళఁజాల
తెలియకజేయు మ ♦ త్కృతదుష్కృతావళుల్
బొలియింపుమమ్మ నే ♦ మోయఁజాల
దూఢి కామక్రోధ ♦ లోభాదివల తాళ్ళ
ద్రెంపుమోయమ్మ సై ♦ రింపఁజాల
తాపత్రయాది బం ♦ ధన క్రియాశృంఖల
మసిఁజేయుమమ్మ. నే ♦ మనఁగజాల

తే॥గీ॥ కరుణనాగామి; ప్రళయాంత♦కముల;నెల్ల
దూరముగ గొట్టుమమ్మ నే♦ద్రోయఁజాల
చిత్తమంతయు నీయందు ♦ జేర్చినాఁడ
నెట్లు జేసిన నీవె, నా ♦ దేమితల్లి!

సీ॥ సంకల్పమునఁజరా • చరమ తోబాటెల్ల
జీవులఁగూడ సృ • ష్టించినావు
సృష్టించి "భ్రమ" ప్రక • ల్పించి "నాద" నెడికో
ర్కెలను శృంఖలఁదగి • లించినావు
తగిలించి యాశాగ్ని • రగులపరచి కామ
క్రోధాదులను నుసి • గొల్పినావు
ఆసఁగొల్పి సతి సుత • వ్యసన మొక్కటిగూర్చి
ధనచింత ముప్పిరిఁ • బెనచినావు

తే॥గీ॥ పెనచియెనలేని సంసార • వనధిఁద్రోసి
మాయఁగ్రమ్మించి; బుద్బుద • ప్రాయులైన
జీవులను నాటలాడఁగఁ • జేసినావు
నీమహాశక్తి నెవరు వ • ర్ణింతురమ్మ!

సీ॥ అస్థి గర్భంబునం । దగ్నిగానున్నది
యిప్పటిమామకై । హికప్రవృద్ధి;
నశ్వరుంగప్పిన యుష్టి । విప్పగానున్నది
యిప్పటిమామక । హితప్రసిద్ధి;
జలదావృతంబైన । చంద్రుగానున్నది
యిప్పటిమామహో । త్కృష్ట సృష్టి;
ధూళిగ్రమ్మిన మణి । లీలగా నున్నది
యిప్పటిమాహితో । న్మేషశక్తి;

తే॥గీ॥ పరగజీవశ్చవంబుల । కరణి నుండె
బ్రబలు యిప్పటి మాయొక్క । బ్రతుకులన్ని
దేవి! మమ్ముప్త త్వత్కృప । బ్రోవకున్న
బ్రతుకంజాలము తల్లి! యీ। క్షితిని మేము

సీ॥ కాలగర్భమునందు । గలసిపోయిన యట్టి
పంచవృత్తులఁ బ్రక । ల్పించుశక్తి;
చెదరి నానాఁటికి । క్షీణమై పోయిన
సంస్కృతాంధ్రాది భా । షాప్రసక్తి?
మహితవజ్ఞతఁబొంది।మరపుఁ జెందినభవ
చ్చరణాబ్జయుగళని । శ్చలతభక్తి
వికృతాకారమై । వీడిపోయిన; జగ
ద్విదితవి స్తృతంద్రజా । తీయకీర్తి

తే॥గీ॥ చూడతామరతంప కా । సూనృతోక్తి
బాసిపోయిన మాప్రతా । పానురక్తి
జారవిడిచిన వైదికా । చారవృత్తిఁ
తిరిగిమాకొనగూర్చ; ను । తింతుమమ్మ!

సీ॥ కాలమా! దుర్నయ ♦ కలితమైదనరారె
సత్యమా! యడుగంట ♦ సాగబారె
జ్ఞానమా! యిటవిల్వఁ ♦ జాలకదివిఁజేరె
ధర్మమా! యలతికం ♦ తలనుదూరె
పాపమా! దేశాల ♦ పైఁబడిమితి మీరె
శాంతమా! పొరుగుపం ♦ చలకుఁదారె
సీలమా! మనలేక ♦ క్షీణమైనగఁగూరె
వేదమా! బ్రహ్మల ♦ వీడగోరె

తే॥గీ॥ బుద్దులావారె; కలిరాజు ♦ బుద్ధితీరె
వృత్తులా తెల్లవారె, భా ♦ వించిచూడ
వింకమా బోంట్లుభువి నిల్చు♦ బెట్లు? తల్లి!
త్వత్కృపారస మొసఁగి ♦ గాఁపాడకున్న.

సీ॥ అస్మదభ్యున్నతి ♦ నరసి సంతోషించు
పరమ ముఖ్యుఁడు జ్ఞానపరుఁడు లేదు
ప్రబలకష్టంబులఁ ♦ బడికుందు నప్పుడైన
గాంచి "పాపం" బను ♦ మనుఁడు లేడు
పొరపొచ్చె మెఱుఁగక ♦ జరియించు నటువంటి
గాఢాభిమానుఁడొ ♦ క్కరుఁడు లేడు
ఆంతర్యముకు సరి ♦ యైనయాలోచనల్
జెప్పనచ్చుఁడు నె ♦ చ్చెలియు లేడు;

తే॥గీ॥ ఆత్మ జూపఁ బరపింద ♦ నరసికొనక,
సర్వమొకరీతిఁ జూచెడు ♦ జనుఁడు లేడు
ఎట్లు బ్రోచెదవో సర్వ ♦ మీవె నాకు
త్వత్కృపారసమిడకున్న ♦ బ్రతుకఁ దల్లి!

సీ॥ శిల్పికాచార్యుల । సృష్టించు వృత్తులు
పరజాతి కరములఁ । బరిఢవిల్లె
బ్రహ్మజాతిఁ పఠించఁ । బడువేద ఋక్కులు
అన్యజాతులయందు । నతిశయించె
క్షత్రియవీరుల । శస్త్రాస్త్రవిద్యలు
లాతి జాతులయందు । ఖ్యాతిబొందె
వైశ్యోత్తముల యొక్క । వ్యవసాయకర్మలు
యితర జాతులయందు । నిమిడిపోయె

తే॥గీ॥ సతతము వేశ్యలకగు వ్యాధి । చారవృత్తి
సకల జాతులయందు న । సంక్రమించె
తారుమార య్యెఁ జగమిఁకే । దారియగునో
చెప్పజాలను నను బ్రోవఁ । దప్పదమ్మ !

సీ॥ సంయమీంద్ర; ముముక్ష । జనపూజితవునీవె
రహిద్రిమూర్తులఁ గన్న । రమణివీవె
అరయఁగ వేద మా । తైనగాయత్రివె
గాయత్రికైన! ఓం. । కారివీవె
ప్రళయకాలాబ్ధిల । ప్రకృతిరూపిణివీవె
పంచభూతములకుఁ । బ్రాణమీవె
ఘనసహస్రాక్ష్యలఁ । గలజగన్మాతవీవె
సర్వశక్తుల కెల్ల । శక్తివీవె

తే॥గీ॥ జీవరాసులఃబోషించు । దేవి వీవె
ఆదిమధ్యాంత రహిత లై । యలరు దీవె
కర్మసాక్ష, సుధాంశు ఋ ।క్షములే;గాక
వెలయు సృష్టెల్ల తల్లి! నీ । వేగదమ్మ,

సీ॥ ఒకపరి వివిధవి • ద్యోపలబ్ధికిఁబోరు
నొకతేప కామినీ • సుకముఁగోరు
నొకసారి యుష్మదీ • యకథామృతముఁగ్రోలు
నొకమాటు సురసన • ముర్విఁదూలు
నొకదభాసంతాన • ప్రకటచింతనఁ బెంచు
నొకవేళ ద్రవ్యంబు • కుత్సహించు
నొకప్రొద్దు యాత్రల • కూరేగఁబురి కొల్పు
నొకతరి వైరక్తి • నొనరిదెల్పు

తే॥గీ॥ తలఁప నొకపూటవేష భా • షలదగుల్చు
ననవి. వినని. కననివావి • నన్నిఁజూపు
నొక్క క్షణమైన కుదురుగా • నుండనీదు
కోతివలెబుద్ధి, నేనేమి • సేతుఁ దల్లి!

సీ॥ శిల్పాంబ! నీమహా • శ్రేష్ఠరూప మొకింత
కన్నులు న్నందుకు • గాంచలేదు;
జనయిత్రి! నీదివ్య • చారిత్రమహిమలు
వీనులున్నందుకు • వినఁగలేదు;
భగవతీ! నీపాద • పద్మసపర్యలు
చేతులున్నందుకు • సేయలేదు!
జగదంబ! నీనామ • జపము రవంతేని
నోరుగలందుకు • నుడువలేదు;

తే॥గీ॥ చేతిమీఁదగ: దానంబు • సేయలేదు
కాసుమైనను చేతిలోఁ । గానరాదు
కాలమిట్లంగిగాఁ దల్లి! గడచు చుండె;
నేమిసేయుదు నాకర్మ • మిట్టులలర.

సీ॥ రాటపాకులరీతి । గాఁ దొంకులేకుండఁ
కాలచక్రము దిరు । గాడుచుండె;
ధనమెల్లఁగొల్లఁ బె । ట్టిన దొరుకఁ యట్టి
తనరు యాయుష్యంబు । తగ్గుచుండె;
వదలనురాక త । ప్పని సమయే, యని
మించిమృత్యువు వెంబ । డించుచుండె;
రుజ జరాదులులేక । రూఢిగానే ప్రొద్దు
మనసనేక విధాల । మఱుగుచుండె;

తే॥గీ॥ బాల్య;యౌవ్వన కౌమార।భరములుడుగ
వార్ధకముఁ ద్రోసికొనిపైకి । వచ్చుచుండె;
నెట్టులేతెరదవోనన్ను । వెంకమీఁద
జాగుసేయుట మేల్గాదు । శరణుతల్లి!

సీ॥ కల్పింతు, మాయ సం । కలిత మీలోకంబు
చేకొని పోషింతు । జీవకోటిఁ
దగిలింతు, దార, సు । తాది బంధకములఁ
గల్పింతు; మోహచీఁ । కటులఁ జిరము
నూగింతు, కొన్నాళ్లు । తూఁగుటుయ్యాలలందు
బిచ్చమెత్తింతు, నీ । కిచ్చఁగొలుపఁ
గూయింతు, దుర్మార్గ । కూఁతలఁ బ్రాజ్ఞుల
నిక్కింతు, మూణ్ణాళ్ళ । నీటొసంగి

తే॥గీ॥ నాది యనిపింతు, కన్నడే । దేవిరైన
జీవమెడలింతు వంత పి। శ్శేషముగను
మహిత భవదీయ శక్తిసా । మర్థ్యమెన్న
నస్మదాదుల వశమౌన । టమ్మదేవి

సీ॥ ననుఁగాంచి పరితో ష • మునఁబెంచు జనకుండు
కాలధర్మము నొందు • కాలమందు
పుత్రద్వయముఁగోలు • పోయి విషాదసా
గరవీచిహతిఁ ద్రెళ్లు • తరుణమందు
సతిబాధకేక ఖిం • శతి లంకణములుంచ
శాంతించమికిఁ గ్రుళ్లు • సమయ మందు
కొందరల్పులు కక్షఁ • గొఁ సేయుదౌష్ట్యముల్
మసిజేసి: నుతిఁగన్న • పట్టునందు

తే॥గీ॥ భవ్యభపదీయదివ్య కృ • పాకటాక్ష
గరిమస్వప్నంబులందు సా • క్షాత్కరించి
కొలఁదిలో మేలుసీకొన • గూడు" నంచు
జెప్పిచను నీకుమ్రొక్కెద • శిల్పమాత!

సీ॥ బాలురతోఁ బాఠ • శాల కేగని నాఁడె
సరళ కవిత్వ ప్ర • సక్తిఁజూపి;
పదియారు వర్షము • ల్గ దిసి యుండని నాఁడె
చిత్రకవిత్వ సం • స్థితులఁ ద్రెంపి?
నూనూఁగు మీసంబు • లుద్భవించని నాఁడె
గర్భకవిత్వ సం • కటములుడిపి;
ప్రాచీనకవి కావ్య • పఠనగల్గని నాఁడె
బంధకవిత్వ శ్రే • ణింవగిల్చి;

తే॥గీ॥ గ్రంథపంచకముసుఁబూర్తి • నొందజేసి
"ఆంధ్రకవి" యను బేరొక • టరశియిచ్చి
ప్రక్కతోఁడుగ నిచ్చింత•వరకు బెంచు
శిల్పమాతా! నమస్కృతుల్ • జేతునమ్మ!

సీ॥ తొలి, శుక్లశోణితం । బులు రెండుగ౽యుట
పిండమై గర్భంబు • వృద్ధిగనుట
శిరము వక్షము; కాలు । సేతులు గలఁగుట
నేత్ర శ్రోత్రములెల్ల । నేరుపడుట
నఖ; శిరోజములు ప్రా । ణంబుఁ జేకూరుట
గతజన్మ విషయముల్ । జ్ఞప్తిగొనుట
ఐహికేచ్ఛలు తుచ్ఛ । మని యాత్మ నెంచుట
భావభిన్నము గఘా। పతనమగుట

తే।గీ। అంత; బాల్యము గడఁ పుట।యౌవ్వనమున
భార్య; సుత; ధన; బంధన। వస్యుఁడయ్యు
చీకుఁబడుట నశించుటీ । స్థితిని నరయ
నీదుమాయను దెల్పెడు । గాదెతల్లి!

సీ॥ మంగళమమ్మ శ్రీ । మద్విరాట్ప్రభు రాణీ
మంగళమమ్మ స । న్మంజువాణి
మంగళమమ్మ వా । గ్మాన సగోచరి!
మంగళందైత్యాదు । ర్గ దపహారి!
మంగళం చేదీప్య । మానరూప వతంసి!
మంగళం మునిహృత్స । మలనివాసి
మంగళం త్రైలోక । మండిత చారిత్ర!
మంగళం దివ్యతా । మరసనేత్ర!
తే॥గీ॥ మంగళం వేదమాతసం । పత్సమేత!
మంగళం సర్వశక్తిస । మగ్రకలిత!
మంగళం బిడౌజోస మస్తు । మనుపుజాత
సృష్టివిఖ్యాత! గుణవ్రాత!! శిల్పమాత!!!

శ్రీ శిల్పమాతృస్తవము
సంపూర్ణం

ఓమ్

శ్రీ గురుభ్యోన్నమః

# మహాత్ముల జీవితావళి

ఆంధ్రకవి :

ఇంకొల్లు శ్రీరామశర్మ ప్రణీతము

పెదక్రొత్తపల్లి

ప్రథమ ముద్రణ : 1927

ద్వితీయ ముద్రణ : 2003

# విషయసూచిక

ఓమ్

# మహాత్ముల జీవితావళి

## శ్రీవిరాట్ పోతులూరి వీరబ్రహ్మేంద్రస్వాములవారు

సీ॥ శ్రీ పౌరుషేయ వా • ర్నిధి పూర్ణ చంద్రుండు
సార్థకాఖ్యవిధా త్మ • సదృశుండు
రంగదుత్తుంగత • రంగభంగిక కీర్తి
అకలంక సచ్చిదా • నందమూర్తి
అజ్ఞాన రహిత కా • లజ్ఞాన నిర్మాత
మహిత శ్రీ గోవింద • మ! పరిణేత
సిద్ధయాదిప్రసిద్ధ • శిష్యహృత్పుట వాసి
భక్త రక్షణ సత్కృ • పా! విభాసి

తే॥గీ॥ వేద: వేదాంత తత్వస • వేది. దీన
రక్షణో ద్యోగ దీక్షా ప • రాయణుండగు
పోతులూరి విరాడ్గురు • పూజజేసి
అఖిలకామ్యార్థములనందు • డయ్యలార

సీ॥ అల్లాటుపల్లి య • నలరు శ్రీ వీరభ
ద్రాచార్యునకు శిష్యుఁ • డై రహించె;
అచ్చమ్మగారి గే • హాంతరవాసియై
తనసారుతన మహ • త్వంబుఁజూపె
భువినాల్గు లక్షల • ముప్పది రెండ్వేల
పూర్తి కాలజ్ఞాన • పాటలను వ్రాసె;
అన్నపానీ యాడు • లంటక గోష్ఠఁ
గిరిగీచి నిలిపెడాఁ • గురులనాపె;

తే॥గీ॥ భక్తివైరాగ్యతత్పర • త్వమున మెలఁగు
నచ్చమాంబకు కారణ • మిచ్చిబ్రోచె
గుడిని పోలేరు చేనిప్పు • కొరవిఁగొనియె
ఇంతవాఁడని వీనివ • ర్ణించు టెట్లు!

సీ॥ అలపుష్పగిరి వార । లలరి; బ్రహ్మరథంబు
బట్టువారిని గాచి । నట్టివాఁడు
సిద్ధపట్నవబాబు । చేరి సన్నుతిఁజేయఁ
గోర్కెమై శిష్యుగా । గొన్నవాఁడు
తాభుజించు పదార్థ । తతినబా బివ్వంగ
క్రిములరులగా సల్పి । నట్టివాఁడు
వరమదుష్ట జనాళి । బ్రాహరణ మొనరించి
శిష్టులనెల్ల ర । క్షించువాఁడు
తే॥గీ॥ క్రమముగా, వచ్చుప్రళయాంత । కముల; ఘోర
శక్తి పంపుల నెఱిఁగించు । శక్తి పరుఁడు
వేదవేద్యుఁడు; శ్రీసిరా । ట్టీర గురుఁడు
జగతి నెవ్వరి రక్షింపఁ । జాలఁడయ్య

సీ॥ యమ; నియమాసనా । ద్యష్టాంగ యోగాళి
క్రమమెల్లఁజిరపరి । శ్రమననేర్చి
కూర్మపద్మాసన । కుక్కుటాసనముల
సమది కధీశక్తి । సంగ్రహించి
స్తవ నీయఖేచరి । శాంబవీ: షణ్ముఖి
లంబికాద్య ఖిలము । ద్రల నెఱింగి
మహిత స్వాధిష్టాన । మణిపూరక. విశుద్ధ
మనసహస్రార చ । క్రముల నెమకి

తే॥గీ॥ లలిత్రి కూటంపు వెలుఁగున।లక్ష్యముంచి
తపమొనర్చి: సహేతు భూ । తములఁజెప్పి
శ్రీపరంజ్యోతి పరమాత్మ । సిద్ధిఁగన్న
వీరగురు పావ; స్మరణగా । వింపుడయ్య

సీ॥ నమ్మువారిని రక్ష • ణ మొనర్చెదను. వి
క్రమమ్మిదియని వ్రతి • కలను వ్రాసి
సెలవిమ్మనెడు ప్రశ్ని • ష్యులఁగాంచి రాబోవు
ఘోరయుత్పాతముల్ • కొన్ని దెలిపి
వీరభోగుని పేర • వెడలి; దుష్టులగూల్చి
ఆశ్రితులను బ్రోతు • నంచు జెప్పి
"అందుకుఁ దప్పితే • హీనజాతింటను
బుట్టెద" ననిచెడ్డ • యొట్టుబెట్టి

తే॥గీ॥ భృశము: నరులకు తత్వముల్ • విశదపరచి
వ్రతికాదూషకులకు శా • పంబొసంగి
మించి సుసమాధిఁ దపమాచ • రించుచున్న
స్వామినుతికన్న మనకేమి • వలయు నింక

సీ॥ శ్రీమదఖండ ల • క్ష్మీనివాసంబైన
భరతఖండంబునం • దరయఁబుట్టి
కామక్రోధాది వ • ర్గములదూలించి; య
ష్టాంగ యోగాదులం • దారితేరి
ఒకచోటనుండి; వే • రొకటఁ బ్రకాసించి
అచ్చటిచ్చటి లోకప్తై • మెచ్చఁబలికి
కుష్టురోగమున నె • క్కువబాధపడు చెన్న
పురివైశ్యుని; నిరోగ • పరునిఁజేసి

తే॥గీ॥ శ్రీరసనారి విశ్వేశ సం • వాదమనెడు
గ్రంథమురచించి; భక్తులఁ • గరుణఁబ్రోచి
యశముఁగాంచిన విశ్వేశ్వ • రావధూత
నభినుతించిన మనపాప • ముడఁగునయ్య

సీ॥ శ్రీరహిం చెడుగందు । కూరి లింగాచార్యు
గర్భాబ్ధిఁ గమలారి । గతిజనించి
క్రిష్ణరాయాస్థాన । కేంద్రీకృతంబైన
కవిపుంగవులలోన । ఘనతవడసి
ప్రతిలేని మధుర వా । క్ప్రౌఢిఁనైరంకుశ
స్థితిఁగుంభవృష్టి స । త్కృతులనెరపి
పూరిదంతముల జయ । మొంది "జగద్గురుం
డ"ని మెచ్చ మేఘ వా । హనముఁజూపి
తే॥గీ॥ గ్గలనిరంకుశో పాఖ్యాన । మను ప్రబంధ
సుతముగనిపెంచి; యాది బి । కనకొసంగి
అల్లుగాఁగొన్న కవిరుద్రుఁ । డంతవాని
స్మరణగావింపుడయ్య! యా । చార్యులార.

సీ॥ పతితాత్ములను సుపా। వనులఁ జేయు నిమిత్త
మనమలగిరి మీఁద । జననమంది
బాల్యమందున శేష । మౌని యిచ్చినయట్టి
ఉపదేశమహిమచే । నొప్పమీరి
మునియాజ్ఞపరిణయ । మునుజేసుకొని గృహ
స్థాశ్రమంబున తను । జాతఁగాంచి
వేలకువేల శి । ష్యాళిని గ్రహించి
జ్ఞాన తత్వోపదే । శంబొనర్చి

తే॥గీ॥ స్థానమందున మఠమొండు। తగసృజించి
పూజనీయములగు గ్రంథ । ములనువ్రాసి
చెలఁగు జీవసమాధి సం । సిద్ధిఁగన్న
దేవ! శివరామ । దేశిక! కావుమమ్ము.

సీ॥ చేయించితివికదా ♦ "చిత్తూరు" పురిలోనఁ
గోర్టు తిర్పరరెగ ♦ గ్గోలుగాఁగ
మెప్పించితివికదా ♦ మేటివైరులదండ
నసుమంతయేని నో ♦ రెత్తకుండ
విరచించితివిగదా ♦ సరిరాని గ్రంథంబు
మాయాప్రబోధలిం ♦ భంజనంబు
ధారవోసితిగదా ♦ ధర్మమార్గాసక్తి
స్వకులాభ్యుదయము వై ♦ సర్వశక్తి

తే॥గీ॥ నడఁచితివిగద హేయంపు ♦ నడతలెల్ల
నిలచెగదనీవు లేమి నె ♦ న్నెన్నొబనులు
నాయనా! మార్గసాహాయ ♦ నామధేయ
ఈవులేనికొఱఁతఁదీరు ♦ టెట్టులయ్య.

సీ॥ మహితదుఃఖాంబోధి • మగ్నులమగు మమ్ము
దరిఁజేర్ప నీవైన • దక్కరాద
బహుకాలము బ్రతుక • వలచినవాడవే
యింతలోమృతినీ క • దేలగలిగె
నాయకుండవటంచు • నమ్మియుంటిమిగాని
యిట్లుబోదువటంచు • నెఱుఁగమయ్య
అక్కటా! మాయభీ • ష్టాళి కారడిగల్గె
నీతోఁడ నపఖ్యా • వేటితోఁడ

తే॥గీ॥ నెనయమా దురదృష్ట మ • దేమొగాని
చక్కని స్థితిగల్గని • సమయమందె
ఒక్కరొక్కరు దివికేగు • చున్నవారు
ఉన్నమాకింక దిక్కెవ్వ • రున్నవారు.

సీ॥ పౌరుషేయాన్వయ । క్షీరాబ్ధినుదయించు
సంపూర్ణపూర్ణిమా । చంద్రుఁడనగ
కడు కులభేదాంధ । కారంబు వారింప
ప్రభవించు యరుణబిం । బంబనంగ
దరిలేని గర్వశా । త్రవశైలములనెల్ల
బొలియింప జనియించు । కులిశమనఁగ
పంఘపునర్ధర్మ । సంస్థాపన ఘటింపఁ
బుట్టిన యవతార । పురుషుఁడనఁగ

తే॥గీ॥ బొలుచు యలవర్తి వంశుండు ।
బుధనుతుండు
అమలచరితుండు నాంజనే।యాహ్వయుండు
లోకబాంధవుఁ డపరాబ్ధి । గ్రుంకుకరణి
నరిగె మననెల్ల దుఃఖ సం । ద్రమునఁద్రోసి,

సీ॥ కులము నెచ్చెలి కాంద్ర । కులసతీమణిబాసి
యుల్లమం దెటుతల్ల । డిల్లినావొ
సచ్ఛాత్రుల రచించు । సద్గ్రంథములవీడి
యుస్సురంచేమాడ్కి । నుడివినావొ
స్వకులోద్ధరణ నిరం । జన శాస్త్రిపైఁబెట్టి
హితము నేపక్కి । వర్ణించినావొ
యీలోకముననుండి । బోలేకపోలేక
కోర్కె లేరీతి గ్రమిం । గు కొనినావొ

తే॥గీ॥ కులపురోభివృద్ధికై యెంతొ । కుంది కనుల
నశ్రువులురాల దివికేటు । లరిగినావొ
శ్రితజన సహాయ సకల వం । దితవిధేయ
అమలమృదుకాయ ఆంజనే । యాభిధేయ

సీ॥ శిల్పమాతృాదేవి ♦ చేయూతవనినమ్మ
పోయితివా! వీట ♦ బుచ్చి మమ్ముఁ
గులముద్ధరించెడి ♦ గుణరాసివని పొంగ
నరిగితివా! పరా ♦ త్పరుని గొలువ
నీపైనిగోరికల్ ♦ నిలిపి యువ్విళ్లూరఁ
జేరితివా! సురా ♦ గారమునకు
సంఘ సంరక్ష దీ ♦ క్షాశాలివని యెంచఁ
బాసితివా! దుఃఖ ♦ వార్థిఁద్రోసి

తే॥గీ॥ అకట! మాయాసలాయా స ♦ మైరహించె
కులపుభాగ్యత నేఁటితోఁ ♦ దొలఁగిపోయె
నేమిసేయుదు మింక మా ♦ కేది దిక్కు
ఆంజనేయ సుధీంద్ర! నీ ♦ వంతరింప,

సీ॥ సంస్కృతాంధ్ర కవిత్వ • సాహిత్య సంపద
గ్రహియించినావు ప్రే • క్షకులుబొగడ
శతవధానంబున • చాతుర్య విభవంబు
చేపట్టినావు; హ • ర్షింప బుధులు
అష్టావధాన నే • త్రావధాన విభూతి
గడియించినావు. దుం • డుడుకుపడక
గర్భా శుబంధాది • కవితా విశేషంబు
లార్జించినావు; బా • ల్యంబు నందె

తే॥గీ॥ అధ్యయన సంవిధాన మం • దారితేరి
యాజ్ఞికము సల్పినావు, సం • ఘైకప్రేమ
జగతిబసవాఖ్యసుక వీంద్ర • చక్రవర్తి!
చారుతరమూర్తి చనితే! వి • శాలకీర్తి!

సీ॥ క్రొత్తపట్టణ సభా । కూటంబునన్జేయు
అష్టావధాన. ప్ర । తిష్టఁజూచి
నెల్లూరుపుర జనా । నీ కంబున ఘటించు
ఆశుకవిత్వ భా । గ్యంబుజూఁచి
టంగు టూర్పురి పిరా । టంకంబుగాఁజల్పు
నేత్రావధాన సం । స్థితినిఁజూచి
రేటూరగౌరీ ప । రిణయంబులోఁజెప్పు
పృష్టాక్షరి సమస్య । సృష్టిఁజూచి

తే॥గీ॥ సంతతానంద నిధిఁదేలు । నకలజనులు
నేఁడుమితిలేని దుఃఖ వా । ర్నిధినిఁద్రోసి
జనితె? బసవాఖ్యసుక వీంద్ర । చక్రవర్తి?
చారుతరమూర్తి! సార, నీ । హారకీర్తి!

సీ॥ మార్గసహాయు ధీ । మతునెడ బాటుకై
ఘోరంబుగా నెంతొ । క్రుళ్లి. క్రుళ్లి.
ఘనుఁడప్పళణ్వాఁభి । ధనువియోగమ్ముకై
మునుకొని దుఃఖాబ్ధి । మునిఁగి; మునిఁగి;
నిష్ఠుణభాతివుండాంజ । నేయుని పోకకై
డెందంబునన్ జింత । జెంది. చెంది.
వెంట; కళ్యాణాఖ్యు । బిడుగోలు చావుకై
పగలు రేలు మఱింత । వగచి; వగచి;
తే॥గీ॥ కడకునినుఁజూచి యట్టి దుః । ఖముల
మఱచి
నీవెమాసర్వమని నమ్మి । నెగడుచుండ
అక్కటా! నీవుఁగూడ మ । మ్మవని విడిచి
జనితె? బసవోత్తమ కవీంద్ర । చక్రవర్తి!

సీ॥ స్వస్థానమగు "కొత్త • పల్లి" యందొక యింత
ప్రస్తుత జీవనో • పాధిఁజూపి
కామరొప్ప "లింగమ • గుంట" లో మెప్పొంది
రమణీయ మౌజీ వ • నము గడించె?
పరగ "గుర్వారెడ్డి • పాలెం" బులోనాఁడె
యించుక భూపస • తేరు పఱచె;
పరికింపఁగా "వెలం • పల్లిలో మాన్యంబు
నార్జించితాముద్దు • లాత్మజకిడె;

తే॥గీ॥ పంచవృత్తులయంద స • మానప్రజ్ఞ
గాంచి యాశ్రిత జనపాళి • కరుణనరసె;
నహహ! సామాన్యుఁడే వీర • యాభిదుండు
తలప; మత్పితృమాతృపి • తామహుండు

సీ॥ శ్రీ మీరఁగ్రొత్త ప • ల్లి కులమందునఁ బుట్టి
గుర్వయ్యయను తాత • కుదురునిల్పి
తండ్రిపీరయ; పిన • తండ్రి యౌలింగ యా
భిదులశుంభత్కీర్తి • వెలుఁగఁజేసి.
లింగమాంబను మంగ • ళాంగినిఁ బెండ్లాడి
వలనొప్పు పుత్రికా • ద్వయముఁగాంచి
అందు లక్ష్మిదేవి • యను పుత్రికనుఁగ్రొత్త
పాలెఁపుట్టింకొల్లు • వంశచంద్రుఁ

తే॥గీ॥ డైన శేషయ్యసుతు సుబ్బ • యార్యుకిచ్చి
పెండ్లిగావించి గృహమందు • బెట్టుకొన్న
ధర్మనిరతుండుస్వపిత మా • తామహుండు
అక్కయాచార్యునతి యింప • కాగు బెట్లు?

సీ॥ అంబికా పాదప । ద్మారాధనంబుఁజింత
నంతరాత్మను బాయ । కలరినాఁడు
ప్రియపుత్రినిడి యింట । బెట్టుకున్నటు వంటి
అత్తమామలదివి । కనిపినాఁడు
గ్రామస్థ శ్రీవిశ్వ । కర్మసాంఘికమందు
నాయకత్వమున జె । న్నారినాఁడు
పరిసరగ్రామ వి । శ్వబ్రాహ్మలతొ గూడి
సంఘకార్యము లెన్నొ । సలిపినాఁడు

తే॥గీ॥ క్షమ; దయాః ధర్మ. సత్య శౌ । చముల యందు
అంచితంబైన ఖ్యాతినా । ర్జించినాడు
ధైర్యవంతుండు, యస్మత్పి।తామహుండు
పండితనుతుండు, సుబ్బయా। ఖ్యుండు ఘనుఁడు

సీ॥ కడుతపః ఫలముగా । గాంచినదాది; న
స్గంటి రెప్పవిధాన । కాచినాఁడు
సామోదమున పాఠ । శాలకునన్నంపి
యించుకతెల్లుఁ జె । ప్పించినాఁడు
పంచశిఖలతోఁడ । పరిణయ మొనరించి
కన్నారముచ్చటఁ । గాంచినాఁడు
పౌత్రపుత్రులకఁజూచి । ప్రాపంచికముఁబాసి
ఏనరానిస్వర్గంబు । కేగినాఁడు
తే॥గీ॥ ప్రేముడిన్గష్టముల నీదు । వేళలందు
కంటికగుపడి తద్వ్యార్థి । గడపినాడు
అట్టి యస్మజ్జనకుఁ డక్క । యార్యునికిమ
దాత్మశుద్ధి గనెపుడు జో । హార్లొనర్తు

మహాత్ముల జీవితావళి సంపూర్ణము.

# మా బ్రహ్మేంద్ర గ్రంథములు

1. బ్రహ్మేంద్ర సేవా దర్పణము
2. బ్రహ్మేంద్ర పారాయణ చరిత్రము
3. బ్రహ్మేంద్ర గేయ చరిత్రము
4. బ్రహ్మేంద్ర చరిత్రము హరికథ
5. బ్రహ్మేంద్ర చరిత్రము బుఱ్ఱకథ
6. బ్రహ్మేంద్ర నాటకము
7. బ్రహ్మేంద్ర భక్తామృతము (పద్య కావ్యము)
8. బ్రహ్మేంద్ర సర్వస్వము (గద్య కావ్యము)

శిల్ప మాతృస్తవము

ఇట్లు,

శ్రీరామ బ్రహ్మాశ్రమము
పెద కొత్తపల్లి - 523 211
మద్దిపాడు మండలము :: ప్రకాశంజిల్లా. ఎ.పి.